# మహాభారత తత్త్వకథనము.

## దుష్ట చతుష్టయ చర్య.

షష్ఠ భాగము.




రచయిత:

సాహిత్య, తర్క, వ్యాకరణ, వేదాన్త పారీణ

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీ గురుభ్యో నమః.

# మహాభారత తత్త్వకథనము.

## దుష్టచతుష్టయ చర్య.

షష్ఠ భాగము.

(బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్తపారీణ)

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

రచియింపఁబడి,

భట్నవిల్లి గ్రామసంస్థాపిత శ్రీ శారదాముద్రణాలయమునందు

ముద్రింపఁబడి,

ప్రకటింపఁబడెను.

ప్రతులు:

1-3-54



[మూల్యం: 3-0-0

ద్వితీయముద్రణాదిసర్వాధికారములు గ్రంథకర్తవే.

# మహాభారత తత్త్వకథనము.

| | | |
|---|---|---|
| 1వ భాగము | అనేకకర్తృత్వనిరాకరణము. | 1- 4-0 |
| 2వ భాగము | వేదవ్యాసనిందానిరాకరణము. | 1- 4-0 |
| 3వ భాగము | శ్రీకృష్ణనిందానిరాకరణము. | 1-12-0 |
| 4వ భాగము | పాండవనిందానిరాకరణము. | 2- 8-0 |
| 5వ భాగము | ద్రౌపదీనిందానిరాకరణము. | 2- 0-0 |
| 6వ భాగము | దుష్టచతుష్టయచర్య. | 3- 0-0 |

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి:
పిఠాపురం.
తూర్పుగోదావరిజిల్లా.

# ఓ విమర్శకా !

ఉ. కౌరవపాండవుల్ పొడము కాలమునందున యుంటఁ జేసి క
న్నారఁగఁ జూచి వ్రాసితి నటంచును వ్యాసుఁడు వ్రాయువ్రాఁత నా
ధారముగాఁ గ్రహించి, స్వమతంబునకున్ సరిపోని యంశముల్
కావు లటందు వీ వపుడు కంటివె యుంటివె యోవిమర్శకా !

ఆ. 'పాఁడియా వటంచుఁ బల్కంగ నింటివాఁ
డనృత మిద్ది గొడ్డుటా' వటంచు
ఇరుగువాఁడు పల్కఁ దెలుఁగున నీనాఁటి
హ్రస్వదృష్టి నాఁటి దనృత మనెను.

ఉ. "వ్యాసుఁడు పక్షపాతి యయి పాండవులన్ బయి కెత్తి, కర్ణదు
శ్శాసనసౌబలాదులను జాల్క్ర లటంచు నధఃకరించి వ్య
త్యాసములన్ లిఖించె నను" దా ఋషి భారతమున్ రచింపఁడే
నీసరిగాని వ్రాఁత లిఖియింతువె? నోరు మెదల్ప నేర్తువే ?

సీ. "కల్పించె వ్యాసుఁ డీకథ" యందువేని లో
పము లెంచు మాకల్పనమున నరసి
"కాదు వాస్తవమె యీగాథ" యన్నచో సాక్షి
యగు వ్యాసుపల్కు లె ప్రస్తుత మనెదు
పక్షపాతముఁ జూపె వ్యాసుఁ డంచనె నాఁడు
నీవ్వంశ చూచితివా వచింపు
తొంటి రాజులు పండితులు మెచ్చి రద్దాని
లేశమౌ నీపాటి ధీకౌశలత.

జాతి కిది వన్నెయా? స్వదేశమున కిద్ది
ఖ్యాతియా? యేమి యొందె నీవ వ్రాఁత చెపుమ!
ఓవిమర్శక! ప్రఖ్యాతి నొందఁ గోర్క
యేని యిదె మార్గ మౌనె యూహించుకొనుము.

ఉ. భారతసూక్తధర్మములపట్లఁ బ్రమాణమతిన్ దొలంత నీ
తీరున దుర్విమర్శముల దెంపరివై రచియించితేమొ? యా
భారత మేమియడ్డపడి బాధ యొనర్చెను నీ కనిష్టమే
నూరకయుండలేక భరతోర్విఁ గళంకమహాబ్ధిఁ ద్రోతువా?

శా. ఆనాఁ డేలజనించినారు కురునాథా! కర్ణ! మీయున్కి నేఁ
డైనన్ బట్టము మీకె కట్టి శ్రమలే కప్పాండువంశంబు పే
రైనన్ లేనటు లిక్కలిప్రజలు మాయన్ జేయరే? నేఁటికిన్
మీ నైర్మల్యము వెల్లడింప శ్రమమేనిన్ మానిరే కాంచుడీ.

శా. వీరస్వర్గముచేరి వేల్పులదరిన్ విజ్ఞానులై — తొంటి దు
శ్చారిత్రంబు స్మరించి మీరె యెదఁ బశ్చాత్తప్తులైనన్ సరే
మీరే యోగ్యులు, మీదె రాజ్యమని కూర్మి న్మీ యెడన్ నించు వా
క్చారుల్ వేనకువేలు గల్గ నిఁక మీకున్ లోప మొందుంగునో!

"కవితాభూషణ, విద్వత్కవిశేఖర"
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.



ఈ గ్రంథ ముద్రణమునకు సహాయము చేసిన మహాదాతలు,
శ్రీ రాజమహేంద్రవరపుర వాస్తవ్యులు, పురపాలక సంఘ సభ్యులు,
వైశ్యకులావతంసులు, ధర్మకార్యనిర్వహణతత్పరులు నగు
శ్రీ శ్రీ జిల్లా సుబ్బారావుగారు.

ఈగ్రంథముద్రణమునకు సహాయము చేసిన మహోదారులును,

రాజమహేంద్రవరపురపాలక సంఘసభ్యులును అగు

# శ్రీ జిల్లా సుబ్బారావుగారి చారిత్రక ప్రశంసాపద్యములు.

రచన:

ముక్కవిల్లి అన్నప్ప దీక్షితులు,
తెలుగు పండితులు, మునిసిపల్ హైస్కూలు,
రాజమండ్రి.

---

ఉ. శ్రీకరవిష్ణుఁ డోముతను సేమము నాయువు పుత్రపుత్రికా
స్తోకవిరాజదర్థములతోడుత జిల్లకులీనుఁడుగన్ మహో
త్సేకరతుండు వైశ్యకులమాన్యగుణోత్తరకీర్తిశాలియై
ప్రాకటదానధర్మముల ప్రాభవ మొందిన సుబ్బరాయునిన్.

ఉ. చందకులాఖ్యగోత్రమున సౌఖ్యయుతాలు మహాకుటుంబముల్
చందనపాదపోత్తములచాలునఁ బుట్టి సుగంధవాసనల్
సిందుచు నెల్లలోకముల చిత్తములన్ గరగించు వానిలో
సుందరవిత్తకీర్తులను శోభిలు జిల్లకుటుంబ మొక్కడే. 2.

క. నెల్లూరను జిల్లాలోఁ
జల్లనిదౌ సన్నమూరు సస్యఫలంబుల్
గొల్లలుగాఁగల యది యీ
జిల్లావంశపునెలవయి సేమము నిచ్చున్. 3.

ఉ. ఆపురమందుఁ గాపురము హాయిగఁ జేయును సుబ్బమాంబతో
నాపణజీవనుండు సుజనాదృతసాత్త్వికశీలశాలి ల
క్ష్మీపతిపాదసేవకుల మేటిగఁ బేరయ వాని యాత్మజుల్
పాపవిదూరులయ్యుఁ గులవర్ధనుఁ డాఢ్యుఁడు సుబ్బరాయుఁడే. 4.

క. పూతచరితోత్తమసం
జాతభవానీపతిపదసరసిజసేవా
చేతోమోదావహ యగు
నాతని కాదెమ యను సతి యైశ్వర్యమునా. 5.

ఉ. అమ్మల నెందఱిఁ గనము హాయిగ నున్నదిమార్చి తిన్పు తే
శమ్ము సుఖమ్ము వృద్ధి యనిశమ్మును లేక చరించువారి లో
కమ్మునఁ, బుణ్యపిత్రముల గౌరవకీర్తుల సుబ్బరాయు నా
దెమ్మది భాగ్యమన్నఁ బతితీరున నంట సతీమతల్లియై 6.

ఉ. కాలము మారిపోయె నిక కల్గవు మంత్రమువల్ల లాభముల్
పొల్లవు దీవనల్ సురలపోఁడుము లేవియుఁ గాన రావటం
చెల్లరు పల్లటిల్లెదరు హీనతఁ, బుత్త్రులఁ గోరి యిష్టిలో
జిల్లకులీనుఁడొందె సుతుఁ జిత్రము కల్మషశూన్యమాటచే. 7.

క. బాలుఁడు సుబ్రహ్మణ్యుఁడు
బాలికలు సత్యవతియునుఁ బార్వతియును మున్
కాలంబున శివు బంగరు
పూలం బూజించి వీర్కిఁ బుట్టిరి యిచటన్. 8.

చ. వినయము పుట్టినిల్లును వివేకనిధానము ధర్మమార్గసం
జనితమహోదయుండు సరసత్వసముద్రుఁడు దీనమానవా
వనమున సందెగొన్న చెయి పండితపోషణమండనుండు దా
ధనమదశూన్యుఁడైన ఘనదాతయు జిల్లకులీనుఁ డొక్కఁడే. 9

ఉ. లక్షలపైన లక్షల విలక్షణమౌనటు సేకరించి యే
పక్షమువాఁడుగాక యొకవైదికకర్మల ధర్మమార్గపుం
రక్షణపక్షమే తనకు రక్షకమౌనని సుబ్బరాయుఁ డా
శిక్షణనీతి నొందు, మును జేసినపుణ్యమ దెంత చిత్రమో ? 10.

శా. తర్కంబేల శబాసనంగ నిట నీతండే పదేశ్వలతో
మార్కండేయశివాలయంబునకు మున్మార్గంబు కట్టించి సం
పర్కం జేసెది గోరఁడా యోఁ దనసౌభాగ్యంపుసంపాదనం
బర్కంబూర్వరలుండు కాలమది స్థైర్యంబుం గనఁగా గోర్కెతో 11

ఉ. రాజనరేంద్రపత్తన మహాజక మానని మొంచి యాత్మలో
నైజపుకార్యముల్ విడచి న్యాయము సేయను సేయఁబూనఁగా
భూజను లెల్ల రెన్నుకొని భూపరిపాలకవర్గసభ్యుతా
భాజన మీరఁడే యనుచుఁ బల్కిరి యూటికిసూటి కాదృతిగా 12.

సీ సుబ్బరాయుని దాన సుబ్బని కీనుంకు
పరిజలలో లేఁడను వాఁడు సాక్షి
సుబ్బరాయుని విత్తశోభకు స్థిరమగు
గ్రంథసంఘంబులు కలవు సాక్షి
సుబ్బరాయుని మనసుబ్బును భక్తిచే
ననుటకు దేవార్చ యనను సాక్షి
సుబ్బరాయు వినయశోభకుఁ బండిత
వృద్ధులే యగుదురు పెద్దసాక్షి. 13.

తే. సూర్యచంద్రులు కలకాలు మార్యజాతి
కెల్ల నుపమానభూతుని జిల్లవంశ
సుబ్బరాయుని సద్గుణశుద్ధశీలు
నెల్లభంగులఁ గాచుత మీశ్వరుండు.

సీ. ధనము వృద్ధినిఁగన్న వినయంబు దగ్గదు
వేల్పుల పూజలు వీడకుండు
సేవ యీకార్యంబు నెజవేర్ప వలె నన్న
సాహసంబున వానిఁ జక్కఁబఱచు

సభ్యుఁడై పురపాలసంఘంబులోపల
గర్వ మావంతేనిఁ గాంచకుండు
పురపాలనంబులోఁ బొరపాట్లు గల్గిన
మది నేవగించుచు మాన్పుచుండు. 14.

తే. ఇట్టి సుగుణపేటి సెట్టికులోత్తరుఁ
బోలు జనులు పుడమిఁ బుట్టబోరు
వీని సుబ్బరాయ వెన్నుఁడు కరుణతోఁ
గాచుఁగాత మెల్ల కాలమందు.

ఉ. ఊహ లవెల్ల మంచివయి యూరక విత్తము పొల్లుసేయకే
యైహికవాంఛలన్ విడచి యాంతరవీథిని బార్వతీశు పు
ణ్యాహలఁ బాదుకొల్పి సుజనేచ్ఛలఁ దీర్చెడు సుబ్బరాయునిన్
శ్రీహయశీర్షుఁ డోముతను క్షేమము నాయువు నిచ్చి లక్ష్మితో 15.

---

## ఆ శీ ర్వా ద ము.

శ్రీ రాజమహేంద్రవరపురవాస్తవ్యులు, వైశ్యకులావతంసులు, ధర్మకార్య నిర్వాహణతత్పరులు, భగవద్భక్తులు అగు శ్రీ శ్రీ జిల్లా సుబ్బారావుగారు ఏతద్గ్రంథముద్రణాదులకు అత్యంతప్రీతితో సంపూర్ణ ద్రవ్యసహాయ మొనరించి తోడ్పడినారు.

వీరిని, వీరికుటుంబమును ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధితో ధర్మ రక్షకుడగు శ్రీకృష్ణపరమాత్మ రక్షించుగాత !

ఇట్లు,
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# MAHA BHARATA TATTWAKATHANAM.

*A Reveiw by Somanchi Lingana B. A., B. L. Advocate,*
ELLORE.

—:o:—

This is a great book of critical appreciation of Maha Bharata and an efficient and effective answer to the ill-informed and hasty criticism against the Great Epic. It has become fashionable now-a-days to court limelight by adversely criticising great persons or great works. That this is after all not so modern a fashion, can be seen from the quotation at page 274 of this book, which puts in poetic language the same path to fame--or rather notoriety. This book is a valiant defence provoked or invoked by the modern critics, who attribute motives to the author of the Great Epic and besmear with mud the noble figures of Maha Bharata, who have been held in affectionate veneration throughout the long ages of Indian History. Our thanks are due mainly to Sri Pendyala Subrahmanya Sastry Garu of Pithapuram, the foremost of those critics in Andhra, for having pulled the author out of his seclusion and his main work of study and teaching ancient lore to eager and affectionate audiences, both young and old, into writing this monumental work. This is an indirect good, resulting from an obvious evil.

Great erudition, prodigious labour, immense faith in Dharma and heroic fervour to defend our venerable ancestors have gone into this book. Nearly, two hundred books have been quoted and referred to. With remarkable clarity, the issues have been extricated from the tangle of verbiage, presumptions, assumptions and assertions. Prejudices and Passions have been laid bare and answered. His skill in logic has stood in great good stead to this author in completely refuting the pseudo-logical arguments of the referred critics. To any unprejudiced reader, this book is a complete refutation of adverse criticisms against Maha Bharata. It has taken six long years to complete this book of adout 1500 Pages. Our heart-felt thanks are due to the Revered Author of this Book, his labour of love.

The first Volume is devoted to a refutation of the plurality of authors of Maha Bharata. It is a long-standang assertion that the Maha Bharata is not the work of a single author but that

three persons have contributed their authorship to this book. In a closely reasoned argument, the author has proved that the whole misconception has started in a misinterpretation of the well-known line in the Asvalayana Gruhya Sutras. The words 'Bharata' and 'Maha Bharata' occur therein. The critics have rushed to the conclusion that they refer to two different books, which have, in course of time, become one. From this premise the critics suggest that the present version of Maha Bharata is the composition of more authors than one. The learned author has proved that Maha Bharata and Bharata are the names of persons and not of books. Thus, the very bottom of the argument of the ctitics is knocked away. Other topics relating to the authorship of Maha Bharata have been ably discussed in this Volume.

The next Valume deals with many so-called defects and faults of Sri Veda Vyasa. The critics alleged that Sri Vyasa was a Chendala, that he was a slave of sexpassions and that he has got deep-rooted prejudices against the Kauravas and is in favour of Pandavas. If we assume that Sri Veda Vyasa is an ordinary individual, subject to the many weaknesses and faults of ordinary human beings, then the attitude of the critics may appear to be somewhat plausible but if we believe that he was beyond the pale of duality of pain and pleasure, of fear or favour etc, and that he is a faithful Recorder of the events as they happened and the hidden motive-springs for these events hidden from ordinary mortal view, then it becomes a sacrilege to attribute motives to Sri Vyasa. The author is a firm believer in the super-human powers and attributes of Sri Vyasa. The critics stoutly deny this. Thus, there seems to be little common ground or accepted authority for judging Sri Vyasa. Taking an ordinary view, there is on reason why Vyasa should be prejudiced against Kauravas and should have been favourable towards Pandavas. They are both equally related to him and are his lineal descendants. From ordinarty stanards, one would prefer those in power than those out of it. If, however, it is conceded that those who are down-trodden and exploited, excite the sympathies and those who stick to the straight path counting no cost too much to pay for it, extract the admiration and that the favourable view of Vyasa is based on those reasons, there is nothing wrong in it. But to imagine Vyasa as just an ordinary human being like any of us, is, to say the least, contrary to the

very Texts on which the critics rely. Othrwise, the whole book Maha Bharata will have to be dismissed as pure fabrication by an unscrupulous author, out to capture the public mind.

The third Volume is devoted to the story of Sri Krishna. From times immemorial, controversies have raged, allegations have been laid and refuted regarding Sri Krishna. Critics allege that he is a thief, a whore-monger, an unscrupulous diplomet, a miracle-monger, a drunkard and what not. For millions that believe he is an Avatar, these allegations appear to be the result of 'asuric' ignorance. Apart from that, the learned author has relied upon many indubitable texts to refute the allegations against Sri Krishna. One of the most interesting episodes, whose very authenticity is disputed, is the incident of giving an interminable sarees to Draupadi. The critics say that the incident of removing the sari of Draupadi is itself a concoction invented purely to discredit the great Duryodhana and his Brothers. The learned author has built an unanswerable case for the truth of the entire episode. The other allegations against Sri Krishna and their answers are familiar.

The fourth Volume seeks to answer the critics regarding the birth and the story of the behaviour of the Pandavas and also the justice of their case for a half share of the Empire. The critics firmly believe that the Pandavas were entitled only for maintenance and nat for a share in the Empire. This is a matter involving questions of Hindu Law as well as questions of fact. We can see the trend of the times is that the Legislature has recently removed certain disqualifications for inheritance. If these disqualifications were there, as obviously they were there, who was the rightful Emperor - Dhrutarashtra or Pandu or neither of them? There is a conflict between the Telugu Mahabharata and the Sanskrit Mahabharata. Undoubtedly, the Sanskrit Mahabharata is the authoritative version. According to the Sanskrit Mahabharata, Pandu was not subject to any congenital incurable defect or disease. He was only of a fairer complexion than others. On the other hand, Dhrutarastra was congenitally and incurably blind. Thus, he was subject to a disqualification preventing him form inheriting his father's Empire. By the Law of Primogeniture, tho Empire was vested in Pandu and after him by the same law of Primogeniture,

Dharmaraju was the rightful heir. If Duryodhana was the eldest of the third generation, some complications might have arisen. Fortunately he was not and Dharmaraju was admittedly older than Duryodhana. It looks as though the argument of those who favour Duryodhana is based upon innate prejudices and predilections rather than on an impartial consideration of the entire case.

The next Volume is devoted to the defence of Draupadi Hers is clearly the most difficult, complicated and controversial figure in the entire Maha Bharata. Her story smacks of foreign influence of exotic customs and habits and her marriage is of such a variety, namely Polyandry, which is universally condemned now-a-days. She is by far the most admirable. the most mysterious, the most beloved and the most feared and hated of all the Maha Bharata lidies. Her character is inexplicable if the events of single life time are taken into consideration. Therefore, Sri Vyasa has taken us into the history of three prior lives of her and has laid bare the inevitability of the history of Draupadi as a consequence of causes set in motion in previous lives. The learned author has been at great pains in this Volume to prove that Draupadi's character is absolutely pure and that she is a Pativrata of the highest order. Much research and erudition are in evidence in this Volume. The story of Draupadi is the most heart-rending. She should normally evoke the heartiest sympathies of anybody by the renunciation She has been able to show in her detachment towards enemies, her steadfastness and devotion to her Lords, her fortitude and organising skill. They are admirable qualities and yet there are critics who say that she was bad woman. The disgusting story that she said once "Though I have five husbands, I want a sixth" has been torn to shreds in this Volume and has been shown to be a pure fabricatiou. He who carefully reads this Volume with an unprejudicd mind, will surely be converted into an admirer of the lovable and pitiable Draupadi. She exhibits intensely human feelings unlike her husbands, who seem to be mainly endowed with divine qualities. Therefore, she is all the more lovable.

The next and last Volume relates to an analysis and description of the four comrades including Duryodhana. Strangely,

Duryodhana and Karna have attracted the admiration and sympathy of some people. Dussasana and Sakuni are usually behind the scenes and are merely tools in the hands of Duryodhana. Duryodhana is a spoilt and wilful child. Dhrutarastra is a doting, ineffectual and fond father. Karna is no doubt an epic character with wonderful charity and nobility. But the way he behaved in order to please his patron Duryodhana, especially in relation to Pandavas is abominable. We might almost say that he sold his noble soul for a mess of pottage. A careful reading of this Volume conclusively proves that justice, right and righteousness are all on the side of Pandavas and the other side is devoid of them.

Sri Varanasi Subrahmanya Sastry Garu has mightily succeeded in his attempt to prove the greatness of Vyasa, of Sri Krishna, of the Pandavas and of Draupadi. In fact, there is little common ground between those who treat Maha Bharata as the fifth Veda and study it with great veneration: those who have intense faith in the authoritativeness of the Sastras and the ancient lore; and those who treat Maha Bharata as a mere book of history or Poetry composed by a fallible person subject to the many foibles and follies and also deep-rooted prejudices and predilections, that the only authority is their own mind. It seems to me to be rather unfair to criticise our ancestors of more than five thousand years ago, their social customs, their notions of right and wrong and their behaviour in complicated situations from our new-fangled notions of to-day. If our ancestors believed that something was right and something was worng, it is no use condemning their notions. They can only be condemned if knowingly, wilfully, perversely or in self-imposed ignorance deviated from the path of virtue as then conceived. These Volumes clearly prove beyond the slightest shadow of doubt that Pandavas never deviated from the path of virtue as conceived by them and approved by the Shastras. This is an immense service to seekers of truth. We are deeply and irredeemably indebted and grateful to the learned author of Maha Bharata Tattvakathanam.

# MAHA BHARATA TATTVAKATHANAMU.

Volume 4.

*By Sri Varanasi Subrahmana sastry Garu.*

(Copies may be had of the author, Pithapuram: East Godavari District. Rs. 2-8-0)

This is the fourth part of the "Mahabharatattvakathanamu" called Pandavanindanirakaranamu Three parts of this book have already been published. This "Mahabharatatattvakathanamu" is in the nature of a reply to the "Mahabharatacharitra" of Pendyala Subrahmanya Sastry, a criticism on modern lines of the Mahabharata.

In the "Mahabharatacharitra" Sri Subrahmanya Sastry pointed out a number of incongruities in customs and manners of the Pandavas which were not in keeping with the Smrithis and other Aryan customs and rites such as the following. The births and customs of the Pandavas were alien to those of the Kauravas and the Bharatiyas; Svetaketu was the first Indian to institute the law of marriage when there was no such law in Indian society; by the time of the Mahabharata there was much promiscuous progeny in the land that Trivishtapa, wherein Arjuna stayed for five years in order to make preparations for war for conquering the Kauravas, is identical with Tibet; that the marriage of the five Pandava brothers with Draupadi was an un-Aryan custom, alien to the land. He quoted profusely from other Sanskrit works besides the Mahabharata in support of his arguments.

Varanasi subrahmanya rastry wrote his work "Mahabharatatattvakathanamu" in order to defend the orthodox viewpoint regarding the Maha Bharata and the Pandavas and their customs, ceremonies and actions. His replies to the several points raised in the "Maha Bharata charitra" are strong and powerful.

Whatever might be the issues at stake between the two writers and whatever one's assessment of the evidence adduced on either side to defend one's own arguments, there is no doubt that there is much intesting material in these Volumes of Maha Bharata Tattvakathanamu. The fourth Volume is as interesting as the other three Volumes already published. The author quotes profusely from a number of Sanskrit works in defence of his arguments.

## MAHA BHARATA TATTVAKATHANAMU.

Volume 5.

*By Sri Varanasi Subrahmanya sastry Garu.*

(Author, Baru st, Pithapuram; East Godavari District.
Rs. 2-0-0)

This volume is the fifth in the series entitled "The narration of the truth of the Mahabharata" published by the author The attempt is to examine the opinions expressed by others with regard to the problems that have been raised in the critical treatises. Mahabharatha is a multifaced gem that has crystallized out of the age-long civilisation and culure of India. It has been commented upon, discussed and interpreted not only in India but throughout the world and translated into almost all the Indian languages and many foreign languages as well. This author has had access to a few such works in Telugu and comments on all of them while establishing his own views. There are two ways of interpreting this great classic, one from the standpoint of modern criticism based on a knowledge of the history of human civilisation and social evolution. The other is the so-called traditional view of interpreting the text from the spiritual or religious basis. The author has taken up the second path.

The previous volumes have been reviewed in these columns and the present one deals with the defence of Draupadi. Forty--four topics beginning with the previous births of Draupadi have been dealt with. The author shows his great and detailed knowledge of the text and the Sastras. He establishes that Draupadi was a very devout person in her previous birth, that she was born out of the sacrificial fire, that she had to be married to five husbands as a natural consequence of her previous birth and this was in no way a reproach to her great chastity and that her ill-treatment in the court of the Kauravas was most undeserved. While establishing these, he freely uses texts with which he is familiar and criticises freely the opinions of his contemporaries.

There are other schools of thought which view the Mahabharata not as the work of one author, and say that an original kernel has swelled into the present huge work by interpolations an d additions. The same school thinks that it represents the

various stages in the evolution of the social and religious order followed by different people in the various parts of India, collected into a compendium as is seen to-day. There cannot be any reconciliation of these too views. But in between there are a few critics who take their stand by turns on one platform and the other and their interpretations are bound to be incoherent. The author examines some of these critical reviews and by his erudition refutes them. The book certainly worth study by those who seek to know the traditional view. The book would have gained in merit if the author had chosen to use more restrained language in his criticism of other commentators.

G. J. S.

THE HINDU; SUNDAY 23--11--1952.

—— ——

संस्कृतपत्रिका—१६--१०--१९५२.

# महाभारततत्त्वकथनम् ।

एतद्ग्रन्थकारः- 'बालव्यास, विद्यारत्न'

श्री वारणासि सुब्रह्मण्यशास्त्री; पीठपुरम् ।

आर्षसिद्धान्ताऽनभिज्ञैरिदानीन्तनैः कैश्चित् महाभारतार्थो व्युत्क्रमेण निरूप्यते ।

द्रौपदीपाण्डवभीष्मद्रोणादयो निन्द्यन्ते; दुर्योधनादयः पूज्यन्ते च । एतादृशभ्रान्तेर्निरसनार्थमुक्तो ग्रन्थः । तत्र ग्रन्थकारस्येमाः सूक्तयः पठनीयाः—

"विमर्शकम्मन्यमानैरसम्बद्धाऽनृतोक्तिभिः ।
कृतस्सारस्वतद्रोहो यावानद्य विचिन्त्यताम् ॥
येषामद्भुतचारीत्रैस्सारस्वतमलंकृतम् ।
ते सर्वे निन्दिता धूर्तैर्विद्यागन्धविवर्जितैः ॥
व्यासमहामुनिनिन्दा पूज्यश्रीकृष्णभगवतो निन्दा ।
पाण्डुसुतोत्तमनिन्दा स्वर्गश्रीद्रौपदीसतीनिन्दा ॥

सर्वज्ञभीष्मनिन्दा द्रोणाचार्योत्तमस्य वै निन्दा ।
इति पुण्यपुरुषनिन्दा बत! निश्शंकं कृता कैश्चित् ॥
किञ्चान्यद्दुर्योधनदुश्शासनकर्णशकुनिषु श्लाघा ।
दुष्टचतुष्टयनाम्ना प्रथितेष्ववलोकयन्तु दौर्भाग्यम् ॥
इति वेदव्यासमुनिश्श्रीकृष्णः पाण्डवाश्च पाञ्चाली ।
पुण्यचरित्रा इति खलु सिद्धं प्रतिवादिनः परास्ताश्च ॥

उक्तेन विदुषा लेखकेनाऽयं ग्रन्थः कुतश्चित्कालाल्लिख्यते प्रकाश्यते च । १, २, ३ भागाः पूर्वमेवागता आसन् । ४, ५ भागाश्च गतदिने लब्धाः । अत्र पाण्डवा न भारतीयाः, किंतु तिब्बतीया इति वादस्य खण्डनपूर्वकं भारतीया एवेति निरूपितम् । तिब्बत एव त्रिविष्टपमिति वादस्य खण्डनम् । अरजस्वला द्रौपदी रजस्वलावेषं धृत्वा दुर्योधनसभां प्रविष्टेति वादस्य खण्डनम् । महाभारते कौरवपक्ष एव धर्म्यः; पाण्डवानां राज्याधिकार एव नासीदिति दुर्वादखण्डनपूर्वकं धृतराष्ट्राराज्यवादनिरसनद्वारा पाण्डुराज एव राज्येऽभिषिक्त इति विषया निरूपिताश्चतुर्थे भागे ।

पञ्चमभागे द्रौपद्याः पूर्वजन्मवृत्तान्तः, द्रौपदीजन्म शुक्रशोणितमन्तराप्ययोनिजानामुत्पत्तिः, द्रौपदीपाणिग्रहणचर्चा, श्रीकृष्णश्च स्वयं कर्णं प्रति "षष्ठे च त्वामहनि द्रौपदी पर्युपास्यती"ति अधर्मं कथमुक्तवानिति पर्यालोचनपूर्वकं श्रीकृष्णगूढाभिप्रायसूचनं, एवं "पञ्च मे पतयस्सन्ति मह्यं षष्ठोपि रोचते" इति श्लोकस्य द्रौपदीवाक्यत्वनिरसनद्वारा तात्पर्यवर्णनं चेति ।

महाभारततत्त्वजिज्ञासूनां सर्वेषां कृते ग्रन्थोऽयमतिलाभदो न संस्कृते, किं त्वान्ध्रभाषायामिति दुःखवार्ता ।

---

# విషయసూచిక.

విషయము. పుట.

# విజ్ఞప్తి.

"విద్యావిహీనః పశుః" అని ఆర్యోక్తి.

విద్య అనగా, ధర్మ-అధర్మములను; అర్థ-అనర్థములను; వైష యిక-సుఖదుఃఖములను; బంధ-మోక్షములను; భగవత్స్వరూపమును, జన్మాంతరమును విశదీకరింపగల జ్ఞానము. ఇట్టి విద్యకు ఆధారభూత మైన గ్రంథములు (విద్యాస్థానములు) పురాణ-న్యాయ-మీమాంసా- ధర్మశాస్త్ర-వేదాంగ-మిశ్రితములగు వేదములు.

ఈ గ్రంథములయందు ఎంత కృషియో అంత విద్య; ఎంత విద్యయో అంత అవిద్యానివృత్తి; అంత మనశ్శాంతి; అంత భగవ ద్భక్తి; అంత పరమార్థదృష్టి; అంత పాపభీతి.

ఈ లక్షణము లున్నపుడే మనుజునకు సత్ప్రవర్తన, కష్టసహిష్ణు త్వము, మనోధైర్యము, యథాలాభసంతుష్టి సంభవించును. ఇట్లు మనుజుని జీవయాత్రలో ముఖ్యసాధనము విద్య. వేదశాస్త్రములవంటి ప్రమాణము లన్యములగునా ? మహర్షులవంటి ప్రామాణికులును, జగద్ధితకారులును, సత్యవాదులును, విజ్ఞాననిధులును అన్యు లగుదురా?

వేదవ్యాసమహర్షి — కురుపాండవచరిత్రవ్యాఖ్యాముఖమున వేదార్థ వివరణరూపము, పురుషార్థ పరిశోధనము నగు మహాభారతమును చతుర్దశ విద్యాస్థానరహస్యములతో కూర్చి లోకమున కనుగ్రహించెను.

ఇది ఎంత కని వినినను తృప్తి తీరకుండునట్టి తద్భూతకథాసంనివే శములతో, లోకజ్ఞానదాయకహితోపదేశములతో, దైవపురుషా కార— బలాబల ప్రదర్శనములతో, భగవదకుంఠిత—జ్ఞాన—శక్తి నిరూపణములతో, అపూర్వవిషయములతో నిరుపమానమై విరా జిల్లుచున్నది.

ఈ మహాభారతకర్త యే బ్రహ్మసూత్రకర్తయు, అష్టాదశపురాణ కర్తయు నయియుండుటచే వేదాంతాధ్యయనసమయమందేమి, పురాణ ప్రవచనసమయమందేమి నిత్యకృత్యముగా శ్రీవేదవ్యాసకీర్తన—నమస్కారములు ఆస్తికలోకములో చేయబడుచునే యున్నవి.

ఇట్లు విద్వాంసులకును, విద్యాభ్యాసకులకును, విద్యాభిమానులకును, విద్యోపజీవులకును నిత్యస్మరణీయుడగు వేదవ్యాసుని మహాభారతము మతాచార్యులచేతను, మహాపండితులచేతను ప్రమాణముగా పరిగ్రహింపబడియున్నది.

ఆధునికులు మాత్రము కొందరు మహాభారతముపై, మహర్షిపై కృష్ణభగవానునిపై, పాండవులపై, మహాపురుషులపై లేనిపోని ఆక్షేపములు లేవదీసి గ్రంథస్థమైనది, జరిగియున్నది కాదని స్వకపోలకల్పనలతో, మహాజనమూమణోక్తులతో తలకొకవిధమున పుస్తకములు రచింపసాగినారు.

అది అక్రమమని నిరూపించి మహర్షియొక్కయు, మహాభారతముయొక్కయు, మహాపురుషులయొక్కయు పవిత్రతాప్రతిష్ఠలను లోకమునకు ప్రకటించుట, ప్రతివాదుల భ్రాంతిని తొలగించుట- ఆర్జించిన విద్యకు, ఆవిర్భవించిన గురుదేవతాభక్తికి, ఆచరించిన ఆర్షసారస్వతోపాసనకు సార్థక్యమని "మహాభారతతత్త్వకథనము" రచింపవలసినవాడ నైతిని.

మహాభారతపరిశీలనములో స్వాభిప్రాయము లేవో పెట్టుకొని వానికి సరిపడునట్లు కనబడు వచనములనే తీసుకొని తావన్మాత్రముచే వచనాంతర— పూర్వోత్తర—విరోధములు లక్ష్యపెట్టకుండ విషయనిర్ణయము చేసివేయుట విమర్శకపద్ధతి.

స్వాభిప్రాయములని యేమియు లేక గ్రంథతాత్పర్యము గ్రహించుటకే తమ బుద్ధిని వినియోగించి యావద్గ్రంథమునకు ఏకవాక్యత నాలోచించి ప్రమాణాంతర-పూర్వోత్తర-విరోధము లేకుండ జూచి విషయనిర్ణయము చేయుచుండుట విద్వత్పద్ధతి. ఈ విద్వత్పద్ధతినే అవలంబించి వ్యాఖ్యానాధారమున గ్రంథసమన్వయప్రదర్శనముతో విమర్శకపద్ధతిలోని దోషములు వెల్లడించి, తత్తన్నిందానిరాకరణ మూలమున మహాభారతవిషయము నిర్దుష్టమని నిరూపింపబడినది.

ఆయా సందర్భములలో ప్రతివాదులు వాడిన మాటలకు- బదులు చెప్పునపుడు వాడబడిన మాటలలో గొన్ని మృదువుగా లేనట్లు కొందర భిప్రాయపడినారు.

మరికొందరిట్లు వ్రాసియున్నారు— "మీపుస్తకము (పంచమ భాగము) చదువుచుంటిని. చాలా బాగున్నది. . వాళ్ళు వ్రాసినదానికి మీరు చాలా మృదువుగా వ్రాసినారు. ఆమార్దవ మట్టివారియెడ చాలదని తోచినది." అని.

మహాభారతోక్త మహాత్ములయెడ అభిమాన మేర్పడినవారికి తోచునట్టి యభిప్రాయ మిది. అది యేర్పడనివారికి తోచునట్టిది పై యభిప్రాయము. మాది తత్త్వకథనతాత్పర్యమె కాని వ్యక్తినిరసన తాత్పర్యము కాదని గ్రహింపవలయును.

ఫలపుష్పముల నిచ్చునట్టి యొక మహావృక్షము నాశ్రయించి జీవించుటలో వృక్షమునకు చేటు రాకుండ కాపాడుకొనుచు ఆపుష్పాదులను సంగ్రహించి లోకుల కందించుచు జీవించుట యొకపద్ధతి. ఆవృక్షశాఖలనే ఛేదించుచు కాల్చి బొగ్గులుచేయుచు వానిని లోకుల కందించుచు జీవించుట యొకపద్ధతి. ఇందు మొదటిపద్ధతి వంద్యము; రెండవపద్ధతి సంద్యము.

వేదవ్యాసభగవానునిచే మన కనుగ్రహింపబడినది మహాభారత కల్పవృక్షము. దీనిని జీవనాధారముగా జేసికొనుటలో పై జెప్పబడిన రెండవపద్ధతి నవలంబింపక మొదటిపద్ధతినే అవలంబించి ఫలపుష్ప ప్రాయములైన పుణ్యపురుష చరిత్రములను యథాతథముగా స్వీయరచనలతోగూడ లోకులకందించుచు పురాతనపుణ్యపురుషులకీర్తి ప్రతిష్ఠలను లోకమున చాటుచు భారతదేశౌన్నత్యమును నిలవబెట్టుచు విద్యాలోపముచే మన ఆర్ష గ్రంథములపట్ల దాపరించిన దుస్థితిని, లోకములో గోచరించు అవినీతిని, అవలోకించి సద్గ్రంథములద్వారా మనభారతీయులలో విద్యావ్యాప్తి యగుటకై పాఠకమహాశయులు పూనికొనలయును. ఇదియే మా విజ్ఞప్తి.

ఇట్లు,
గ్రంథకర్త.





'బాలవ్యాస'

బ్ర. వే. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీ మహాగణాధిపతయే నమః.

శ్రీ గురుభ్యో నమః.

# మహాభారత తత్త్వకథనము.

## దుష్టచతుష్టయ చర్య.

"పాండవపూజ్యత్వాభివ్యక్తి స్తద్వైరికృత్యవిజ్ఞానాత్ ।
స్యా దితి దుష్టచతుష్టయచర్యా సంగృహ్యాతేఽత్ర పశ్యన్తు ॥

"దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః స్కన్ధః కర్ణః శకుని స్తస్య శాఖాః ।
దుశ్శాసనః ఫలపుష్పే సమృద్ధే మూలం రాజా ధృతరాష్ట్రోఽమనీషీ" ।

"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః స్కన్ధోఽర్జునో భీమసేనోఽస్య శాఖాః।
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ" ॥
(ఆది- ౧1)

### —♦ దుష్టచతుష్టయము ♦—

దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని వీరు దుష్టచతుష్టయమని చెప్పబడెను. ధర్మాత్ములగు పాండవుల కనేకబాధలుకలిగించి వారి రాజ్య మపహరించి వారిపై యుద్ధమునకు కాలుదువ్వి తుదకు కౌరవవంశనాశనమునకు కారణమైనది యీ దుష్టచతుష్టయమే అనియు, పాండవులు నిరపరాధులనియు మహాభారత ముద్ఘోషించుచున్నది. ఈ విషయమును గాంధారియే స్పష్టముగా జెప్పినది.

—♦ 'కురువంశనాశనమునకు దుర్యోధనాదుల దుష్టత్వమే కారణము. పాండవులు నిరపరాధులేలని' గాంధారి చెప్పుట ♦—

యుద్ధమృతులను గూర్చి దుఃఖించుచు పుత్రశోకములో మునిగియున్న గాంధారి, తనకు ధర్మజుడు నమస్కరింపవచ్చినపుడు తత్కాలాగతుడైై తనొద్దనున్నట్టి వ్యాసభగవానునితో ప్రస్తావించుచు నిట్లు చెప్పినది—

"దుశ్శాసనాపరాధేన శకునేస్సౌబలస్య చ ।
కర్ణదుర్యోధనాభ్యాం చ కృతోఽయం కులసంక్షయః ॥
నాపరాధ్యతి బీభత్సుః న చ పార్థో వృకోదరః ।
నకుల స్సహదేవ శ్చ నైవ రాజా యుధిష్ఠిరః" ॥ (స్త్రీ- పర్వ)

దుర్యోధన, దుశ్శాసన, కర్ణ శకునులు దుర్మార్గులచేతనే కులక్షయమైనది. పాండవుల తప్పేమియు లేదు అని.

ఆంధ్రభారతము— ధర్మంబు పరిగ్రహించి సోదరులగు పాండవుల దోసంబు నిగ్రహింపుమనిన గంధవతీనందనునకు గాంధారరాజనందన యిట్లనియె—

సీ. "ఏననూయాగ్రస్తగాను వీరల జెడ దలచెద నెట్లు లుమ్మలిక జేసి
కలిగితి గాక యి కౌంతేయవర్గంబు నొంతి కెట్టును నాకును ధరింప
వలదె దుర్యోధను తులువతనంబున శకునియు గర్ణదుశ్శాసనులును
దుష్టాత్ము లగుటను దురింగె గౌరవకుల మదరి పాండవులు గయ్యంబు పాసి
జంపి రందఱ నది మది నొంపజాలదు"

—♦ పుత్రశోకముతో దుఃఖించు ధృతరాష్ట్రునితో దుర్మంత్రుల మాటలు నీవు వినుటచే నింత చేటువచ్చెనని సంజయుడు చెప్పుట ♦—

"న త్వయా సుహృదాం వాక్యం బ్రువతా మవధారితమ్ ।
అసి నైపైః ధారేణ స్వబుద్ధ్యా తు విచేష్టితమ్ ॥
ప్రాయశోఽకృత సంపన్నా స్సతతం పర్యుపాసితాః ।
యస్య దుశ్శాసనో మంత్రీ రాధేయ శ్చ దురాత్మవాన్ ॥
శకుని శ్చైవ దుష్టాత్మా చిత్రసేన శ్చ దుర్మతిః"

ఆప్తోపదేశములు చెవిని బెట్టక పదునైన కత్తివంటి స్వబుద్ధిచే వ్యవహరించితివి. నీవెప్పుడు దుశ్చరితులనే ఉపాసించితివి. దుష్టాత్ములైన దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని, చిత్రసేనుడు నీకు మంత్రులైరి.

ఆంధ్రభారతము — సుహృజ్జనంబు లుపదేశించిన మాటలు వినవైతి వని నీవుచెప్పె దుమ్మలింపం బనియేమి. నీకును నీకొడుకులకు మంత్రులు దుశ్శాసనుండును, కర్ణుండును, శకునియు నట యేమి సెప్పగల దవధరింపుము.

—♦ కుంతీసమేతముగా పాండవులను లక్కయింట
దగ్ధముచేయ సంకల్పించినది దుష్టచతుష్టయమే ♦—

తత స్సుబలపుత్రి స్తు రాజా దుర్యోధన శ్చ హ ।
దుశ్శాసన శ్చ కర్ణ శ్చ దుష్టం మన్త్ర మమన్త్రయన్ ॥
తే కౌరవ్య మనుజ్ఞాప్య ధృతరాష్ట్రం నరాధిపమ్ ।
దహనే తు సపుత్రాయాః కున్త్యా బుద్ధి మకారయన్'' ॥ (ఆది- ౧14)

కర్ణ శకుని దుర్యోధన దుశ్శాసనులు దురాలోచనము చేసి ధృతరాష్ట్రుని అనుజ్ఞపై పాండవులు వారణావతమునకు తల్లితోగూడ వెళ్ళునట్లు చేసి అక్కడ వారినందరను దగ్ధముచేయవలెనని సంకల్పించిరి.

—♦ ద్రౌపదీవివాహముతో ద్రుపదుని బలము పాండవులకు
సంభవించియుండ బలవిఘాతము వారికి గలిగింపవలెనని
కర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రునితో చెప్పుట ♦—

"తతో దుర్యోధన శ్చాపి రాధేయ శ్చ విశాంపతే ।
ధృతరాష్ట్ర ముపాగమ్య వచోఽబ్రూతా మిదం తదా ॥
సన్నిధౌ విదురస్య త్వాం దోషం వక్తుం న శక్నుమః ।
వివిక్త మితి వక్ష్యావః కిం తవేదం చికీర్షితమ్ ॥
సపత్నవృద్ధిం య త్తాత మన్యసే వృద్ధి మాత్మనః ।
అభిష్టౌషి చ య త్క్షత్తు స్సమీపే ద్విపతాం వర ॥
తేషాం బలవిఘాతో హి కర్తవ్య స్తాత నిత్యశః ।
తే వయం ప్రాప్తకాలస్య చికీర్షాం మన్త్రయామహే ।
యథా నోన గ్రసేయు స్తే సపుత్రబలబాన్ధవాన్ ॥ (ఆది. అ 200)

పాండవులు ద్రౌపదీపాణిగ్రహణము చేసి ద్రుపదపురమున నున్న వార్త దెలిసికొని విదురుడు ధృతరాష్ట్రునితో వారినిగూర్చి ముచ్చటించి వెళ్ళినతరువాత కర్ణుడు, దుర్యోధనుడు ధృతరాష్ట్రుని యొద్దకు జేరి యిట్లనిరి. మహారాజా! విదురుని సమక్షములో మేము

నీకేమియు మారుమాట జెప్పలేకున్నాము. ఇప్పు డన్యులు లేరుకనుక మాటలాడుచున్నాము. నీవు శత్రువృద్ధినే ఆత్మవృద్ధిగా భావించుచున్నావు. ఆశత్రువులను విదురునియొద్ద స్తుతించుచున్నావు. నీ సంకల్ప మేమి? వారు మనల నందరిని కబళింపకుండుటకై వారికి చేకూరిన బలమునకు విఘాతము కలిగించుటే మనకు నిత్యకర్తవ్యము. ఈ సమయమున మనకు కర్తవ్యమిది అని మేమాలోచించినాము. అని. దీనిపై ధృతరాష్ట్రు డిట్లనెను—

"అహ మప్యేవ మేవైత చ్చికీర్షామి యథా యువామ్ ।
వివేక్తుం నాహ మిచ్ఛామి త్వాకారం విదురంప్రతి ॥
తత స్తేషాం గుణానేవ కీర్తయామి విశేషతః ।
నావబుధ్యేత విదురో మమాభిప్రాయ మింగితైః ॥
య చ్చ త్వం మన్యసే ప్రాప్తం త ద్బ్రవీహి సుయోధన ।
రాధేయ మన్యసే య చ్చ ప్రాప్తకాలం వదాశు మే ॥ (ఆది. అ 201)

నా మనోగతము మీ మనోగతము నొక్కటే. నా హృదయము విదురునకు వెల్లడికాకుండుటకై పాండవుల గుణములనే విశేషముగా విదురునియొద్ద కీర్తించుచుందును. ఓ కర్ణదుర్యోధనులారా! ఇప్పుడు చేయవలసిన పని యేమి మీ రాలోచించినారో చెప్పుడు? అని.

ఆంధ్రభారతము— "దుర్యోధనుండు పాండవపాంచాలవిభేదనోపాయంబు చింతించుచుండె నంత విదురుండు పాండవాభ్యుదయంబును, పాంచాలీస్వయంవరంబును, దుర్యోధనాదులు భగ్నదర్పులగుటయు విని సంతసిల్లి పాండవులు ద్రుపదరాజపుత్త్రిం బెండ్లియై ద్రుపదుపురంబున నున్నవారని ధృతరాష్ట్రునకుం జెప్పిన నతం డిట్లనియె—

ఆ. యజ్ఞసేను కూతు నభిజాత నాతని యజ్ఞవేది నుదితయయినదాని
నవఘ విధివివాహ మయి పాండునందనుల్ మిగుల మిత్రబలసమృద్ధులయిరి.

క. కొడుకుల యభ్యుదయము విని, కడుసంతసమయ్యె నిపుడు కౌరవకుల మే
ర్పడ తెలిగ గెల్లరాజుల, నొడిచిన భుజవీర్యమును మహోత్సాహమునన్.

వ. అని విదురునకు బ్రియంబుగా బలికి యంతఃపురంబునకుం జని యంతస్తాపం బేర్పడకుండ నుండునంత కర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రుపాలికిం జని యిట్లనిరి—

క. శేయఁను బగలును విదురుడు, నీయొద్దన యునికిజేసి నేరముపలుకన్
మాయిష్టం బెఱిగింపగ, ధీయుత యెడగంటి మిన్ని దివసంబులకున్.

క. విదురుడు పాండవహితుడని, మొదలన యెఱిగియును నతివిమోహంబునన
వ్విదురు వచనంబ నిలుపుదు, హృదయంబున నతడు పెద్ద యిష్టుడు మాకున్.

వ. అనిన వారలకు ధృతరాష్ట్రిం డిట్లనియె.

సీ. పలుకుల జెయ్వుఁజ బాండవులకు బ్రీతి, గలయట్లయుండుదు గాని నాదు
హృదయంబు విదురున కెన్నండు నెరిగింప, నేను మీతలచిన యివ్విధంబ
తలచుచునుండుదు దైవసంపదగల, వారల బాండవవరుల నేమి
సేయంగనగు నెద్ది సెప్పు డిష్టం బింక"

ఈ కర్ణదుర్యోధనధృతరాష్ట్రిల సమాలోచనమునకు బూర్వ వృత్తాంతమేమి? పాండవులు ధృతరాష్ట్రోపదేశమున వారణావతమునకు వెళ్ళి అక్కడ దుష్టచతుష్టయకల్పితమైన లక్కయింటి ముప్పునుండి తప్పించుకొని, దుష్టులు హత్యకై తలపెట్టిన దుస్తంత్రమును తెలిసికొని తప్పించుకొనిన మన మిప్పుడు బహిర్గతులమే అయినయెడల తమదుస్తంత్రము వెల్లడియైనది కదా యని యిక ఆయుధములతోడనే వధింపవచ్చి వారు మనపై బడుదురనియు, అప్పుడు వారిపై మనము చేయి చేసికొనవలసివచ్చుననియు, తన్మూలమున వారిని వధింపవలసివచ్చుననియు, అట్లు జరుగకుండుటకై మనము కొంతకాల మజ్ఞాతచర్యగా సంచరించిన పక్షములో పాండవులు మరణించినారని వారు భావింతురనియు, అందువలన "మరణాంతాని వైరాణి" అన్నట్లు వారిహృదయములు శాంతింపవచ్చుననియు ఈవిధముగా దూరదృష్టితో నాలోచించి ఆ పాండవులు అజ్ఞాతముగనే కొంతకాలము సంచరించినారు.

అప్పుడు లక్కయింట పాండవులను దుష్టులగు దుర్యోధనాదులు దగ్ధముచేసినారను లోకాపవాదము కురువంశీయులకు దుర్భరమైపోయినది. అట్టి లోకాపవాదముతో భీష్మధృతరాష్ట్రాదులు కుందుచుండిరి. దుర్యోధనాదులు సంతోషించిరి.

అంతట పాండవులు బ్రాహ్మణవేషములతో క్రమక్రమముగా ద్రౌపదీస్వయంవరసమయమునకు ద్రుపదపురమున కేగి, అచ్చట మత్స్యయంత్రభంజనపూర్వకముగా ద్రౌపదిని పరిగ్రహించి, ఆసమయములో నెదుర్కొనిన కర్ణాదుల నోడించి, ద్రౌపదీపాణిగ్రహణము చేసి ద్రుపదపురమున సుఖముగా నుండ నప్పుడు పాండవులు జీవించి యుండుటెగాక అభ్యుదయాభివృద్ధిగా గూడ నున్నట్లు విని దుర్యోధనాదులకు గలిగిన చింతకు మేర లేదు. వారికప్పుడు కలిగిన దురూహలివి— ద్రుపదునకు పాండవులకు మిత్రభేదము కలిగింపవలయు ననియు, లేక ద్రౌపదీనిమిత్తమున పాండవులలో బరస్పరకలహము కలిగింపవలెననియు, లేదా పాండవులకు వేర్వేరుగా స్త్రీరత్నములను దెచ్చి వారికి ద్రౌపదియందు విరక్తి బుట్టింపవలెననియు, లేదా అయిదుగురితో కాపురముచేయుట కష్టమని ద్రౌపదికే పాండవులపై విరక్తి కలిగింపవలె ననియు, మాయోపాయముల భీముని వధించి వారల బలహీనుల జేయుదమనియు దుర్యోధను డనెను. దీనిపై కర్ణుడిట్లనెను—

ఆంధ్రభారతము— "ఈ యుపాయప్రయోగంబులన్నియు మడిఁగి యిప్పుడు పాండవులయందు విక్రమంబు ప్రయోగించుట కార్యంబు. చతురంగబలసాధనసన్నద్ధులమయి యుద్ధంబునం బాంచాలు భంజించి పాండవుల నొండుగడ నుండనీక తోడ్కొని తెత్తమనిన కర్ణు పలుకు లాకర్ణించి"

"తే బలేన వయం రాజన్ మహతా చతురంగిణా ।
ప్రమథ్య ద్రుపదం శీఘ్ర మానయామేహ పాండవాన్ ॥
నహి సామ్నా న దానేన న భేదేన చ పాండవాః ।
శక్యా సాధయితుం తస్మా ద్విక్రమేణైవ తాన్ జహి ॥
తా న్విక్రమేణ జిత్వేమా మఖిలాం భుంక్ష్వ మేదినీమ్ ।
అతో నాన్యం ప్రపశ్యామి కార్యోపాయం జనాధిప ॥ (ఆది. అ 202)

దుర్యోధనా! నీవూహించిన విధముగా పాండవులను సామదానభేదములతో జయించుట శక్యము కాదు. మనమిప్పుడు సేనలతో వెళ్ళి ద్రుపదుని జయించి పాండవుల నిక్కడకు తీసుకొనివత్తము. నీవు

వారిని పరాక్రమముచేతనే వధించి యీ అఖండభూమండలమును అనుభవింపుము.

ఇట్లు దుర్యోధనుడు, కర్ణుడు తనయొద్ద వెల్లడించిన పాండవ నిగ్రహపద్ధతులను విని ధృతరాష్ట్రుడు కర్ణునిధోరణి కభినందించి మీరును భీష్మద్రోణవిదురులును కలిసి మరొకసారి ఆలోచించి చేసి నది శ్రేయస్కరమని చెప్పి వెంటనే భీష్మాదులను పిలిపించి ఆ విషయ మును వారియొద్ద వెల్లడింపగా భీష్మాదు లిట్లు బోధించిరి.

—♦ అపకీర్తికి పాలుకాక పాండవులను ప్రేమించి వారి కర్ధరాజ్య మిచ్చి వర్ధిల్లు డని భీష్మాదులు దుర్యోధనునకు బోధించుట ♦—

భీష్ము డిట్లు చెప్పెను— మీరు పాండవులతో విరోధించు టకు నే నంగీకరింపను. నాకు ధృతరాష్ట్రు డెట్టివాడో పాండురాజును అట్టివాడే. నాకు గాంధారీపుత్రు లెట్టివారో కుంతీపుత్రులును అట్టి వారే. పాండవులు నాకు ఎట్లు రక్షింపదగినవారో ధృతరాష్ట్రా! నీకును అట్లే రక్షింపదగినవారు. నాకును ధృతరాష్ట్రునకును పాండవులు ఎట్లు రక్షింపదగినవారో దుర్యోధనా! నీకును అట్లే రక్షింపదగినవారు. కురువంశీయులందరకు ఇది తప్పనిది.

"ఏవం గతే విగ్రహం తైర్న రోచే సంధాయ వీరైర్దీయతామర్ధభూమిః ।
తేషా మపీదం ప్రపితామహానాం రాజ్యం పితుశ్చైవ కురూత్తమానామ్ ॥
దుర్యోధన యథా రాజ్యం త్వ మిదం తాత పశ్యసి ।
మమ పైతృక మిత్యేవం తేపి పశ్యన్తి పాండవాః ॥
యది రాజ్యం న తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః ।
కుత ఏవ తవాపీదం భారతస్యాపి కస్యచిత్ ।
అథ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ ॥
తేపి రాజ్య మనుప్రాప్తాః పూర్వ మేవేతి మే మతిః ।
మధురేణైవ రాజ్యస్య తేషా మర్ధం ప్రదీయతామ్ ॥
ఏతద్ధి పురుషవ్యాఘ్ర హితం సర్వజనస్య చ ।

అతోఽన్యథా చేత్క్రియతే న హితం నో భవిష్యతి ॥
తథా ప్యకీర్తి స్సకలా భవిష్యతి న సంశయః ॥
నష్టకీర్తే ర్మనుష్యస్య జీవితం హ్యఫలం స్మృతమ్ ॥
దిష్ట్యా ధ్రియన్తే పార్థా హి దిష్ట్యా జీవతి సా పృథా ।
దిష్ట్యా పురోచనః పాపో న సకామోఽత్యయం గతః ॥
యదా ప్రభృతి దగ్ధా స్తే కున్తీభోజసుతా సుతాః ।
తదాప్రభృతి గాన్ధారే న శక్నో మ్యభివీక్షితుమ్ ॥
త దిదం జీవితం తేషాం తవ కిల్బిషనాశనమ్ ।
సంమన్తవ్యం మహారాజ పాండవానాం చ దర్శనమ్ ॥
నచాపి తేషాం వీరాణాం జీవతాం కురునందన ।
పిత్ర్యోంశః శక్య ఆదాతు మపి వజ్రభృతా స్వయమ్ ॥
తే సర్వేఽవస్థితా ధర్మే సర్వే చైవైకచేతసః ।
అధర్మేణ నిరస్తా శ్చ తుల్యే రాజ్యే విశేషతః ॥
యది ధర్మ స్త్వయా కార్యో యది కార్యం ప్రియం చ మే ।
క్షేమం చ యది కర్తవ్యం తేషా మర్ధం ప్రదీయతామ్ ॥ (ఆది. అ 203)

దుర్యోధనా! అధర్మము తగదు. కనుక నీవు పాండవులతో శత్రుత్వము పెట్టుకొనుట నా కిష్టము కానిపని. ఆ వీరులతో సఖ్యపడి అర్ధభూమి వారికిమ్ము. కురూత్తములైన పాండవులకు ప్రపితా మహానుక్రమముగా వచ్చి పిత్ర్యమైన రాజ్యమే యిది.

దుర్యోధనా! నా పిత్ర్యమని నీ వనుకొనుచున్న రాజ్యమునే మా పిత్ర్యమని వా రనుకొనుచున్నారు. పాండురాజునకు ఔరససంతానముకాక క్షేత్రజసంతానమైన పాండవులు రాజ్యము మా పిత్ర్యమని యెట్లు పొందగలరు? ధృతరాష్ట్రుని యౌరససంతానమైన నేను పిత్ర్యమని పొందగలను. అని నీ కూహ కలదేమో! నీ యూహను బట్టి చూచినయెడల నీ పితామహుడైన విచిత్రవీర్యుని రాజ్యము ఆ విచిత్రవీర్యుని యౌరససంతానముకాక క్షేత్రజసంతానమైన నీ తండ్రి ధృతరాష్ట్రునకు పిత్ర్యముగా ప్రాప్తింపనేలేదు. నీ తండ్రికి ప్రాప్తింపని రాజ్యము పిత్ర్యముగా నాకు ప్రాప్తించినదని నీ వనుకొను టెట్లు?

ఇక నీతండ్రికి ధర్మముగనే ప్రాప్తించి పిత్ర్యమై నీకు ప్రాప్తించిన దందువా? అట్లైన పాండవులకు ముందే ప్రాప్తించినది. ఏమందువా? నీ తండ్రి అంధుడగుటచేత కనిష్ఠుడైనను పాండురాజే రాజ్యాభిషిక్తుడయ్యెను. అందుచే పాండవులకు ప్రాప్తించియున్నది. ఆపై యింతకు బూర్వమే ధర్మజుడు యువరాజు కావింపబడెను.

కనుక ప్రీతితో వారి కర్ధరాజ్య మిమ్ము. ఇది సర్వలోకహితము. దీనికి భిన్నముగా జేయుట మనకు శ్రేయస్సు కాదు. నీకును గొప్ప అపకీర్తి వచ్చును. కీర్తి పోయినపుడు జీవించుట వ్యర్థము. మన అదృష్టముచేత పాండవులు, కుంతీదేవి జీవించియున్నారు. వారిని దగ్ధము చేయదలచిన పాపియగు పురోచనుడు మరణించినాడు. ఆ పాండవులు దగ్ధులయినారను వార్త తెలిసినది మొదలు నేను ప్రజలముఖము చూడలేకున్నాను. పాండవులు జీవించియుండుట, వారిని దర్శించుట నిపాపపరిహారహేతు వని తెలిసికొనుము. వీరలైన ఆ పాండవులు జీవించియుండ వారిపిత్ర్యమైన అంశము (భాగము) ఇంద్రుడైన తీసికొనజాలడు. ఆ పాండవులు ధర్మనిష్ఠులై యున్నారు. ఏకచిత్తముకలిగి యున్నారు. అట్టివారు కేవల మధర్మముగా త్రోసివేయబడినారు. విశేషించి నీతో తుల్యముగా రాజ్య మనుభవింపదగియుండగా త్రోసివేయబడినారు. దుర్యోధనా! నీవు ధర్మాత్ముడవైన – నాప్రీతిని నీవు కోరువాడవైన – లోకక్షేమము నీవపేక్షించువాడవైన పాండవుల కర్ధరాజ్య మిచ్చివేయుము. అని.

ఈ భీష్మవాక్యములలో "దుర్యోధన యథా రాజ్యం" అని యున్న మూడు శ్లోకములకును "కురుపాండవదాయభాగవినిర్ణయము" అనుగ్రంథములో ఏదో అర్థము చెప్పి—

"ఈ వాక్యములవలన నీరాజ్యముభయులకునుగూడ పైతృకముగానే చెందినట్లును, ఉభయులును గూడ ధర్మముచేతనే పొందినట్లును విస్పష్ట మగుచున్నది". (పు- 19)

అని వ్రాయబడినది. ఈయర్థములో వచ్చెడి విరోధములు, ఆవాదమునకు గల అప్రామాణికత్వము మొదలగునవి. "పాండవ నిందానిరాకరణము" అను చతుర్థభాగములో నిరూపింపబడినవి కనుక అచ్చట జూడవలెను.

ఈ భీష్మవాక్యములలో పాండవుల కర్ధరాజ్య మిమ్మనియు, వారికి అది పిత్ర్యమైన అంశ మనియు జెప్పబడినదిగాని మిగిలిన యర్ధరాజ్యము నీకు పిత్ర్యమైన యంశమని దుర్యోధనునకు చెప్పబడలేదు. తాత్పర్య మేమనగా— దుర్యోధనునకు విడువదలచిన అర్ధరాజ్యము పాండవుల అర్ధరాజ్యమువలె సర్వాధికారములు కలది కాదనియు, పాండవుల పోష్యవర్గములోని దుర్యోధనాదుల కది యావజ్జీవోపభోగ్యమే అనియు సూచించుటే అని తెలిసికొనవలయును.

గాంధారి దుర్యోధనున కుపదేశించునపుడు కూడ—

"అల మర్ధం పృథివ్యాస్తే సహామాత్యస్య జీవితుమ్" ।

సపరివారముగా జీవించుటకు నీ కర్ధరాజ్యము చాలును. అనియే చెప్పినది. యావద్రాజ్యము పాండవులదే అయియున్నను ధృతరాష్ట్ర ధార్తరాష్ట్రాదుల పోషణభారము పాండవులదే కనుక వారి పోషణము నకై అర్ధరాజ్యము దుర్యోధనాదుల అనుభవములో నుంచనిచ్చి మిగిలిన అర్ధరాజ్యము పాండవులు పరిగ్రహించునట్లు చేయదలచి భీష్ముడు దుర్యోధనునితో వారి కర్ధరాజ్య మిమ్మని చెప్పెనేకాని పాండవులకున్నది అర్ధరాజ్యాధికారమే అని కాదు. తలకొకవిధముగా ప్రతివాదులన్నట్లు అర్ధరాజ్యము వారికి పిత్ర్యము, అర్ధరాజ్యము దుర్యోధనునకు పిత్ర్యమనియు గాదు. అవిభాజ్యమైన రాజ్యమును రెండుముక్కలు చేయవలయు ననియు గాదు. యావద్రాజ్యాధికారము దుర్యోధనునిది, స్వవంశీయులైన పాండవులపోషణభారముకూడ దుర్యోధనునిదే, కనుక పాండవుల కర్ధరాజ్య మిప్పింపవలె ననియు గాదు. ఇక పాండవులు కురువంశీయులు కారు. భారతీయులే కారు. అయినను ఇక్కడ పరి

గినవారు కనుక నిరాధారులై యున్న పాండవులకు దయాధర్మభిక్షగా అర్ధరాజ్య మిప్పింపవలె నవియు గాదు. కనుకనే దుర్యోధనునకు పిత్ర్యమనక పాండవులకు పిత్ర్యమని, పితృపైతామహామని భీష్ముడు చెప్పెను.

ఆంధ్రభారతము— భీష్ముడు బుద్ధిసెప్పుట- "అప్పాండవులతో విగ్రహంబు సేయుట కెన్నండును నొడంబడ. పితృపైతామహంబయిన రాజ్యంబునకు నీయట్ల వారు నర్హులుగావున వారికి నర్ధరాజ్యం బిచ్చిన నీకును, నీబాంధవులకును, లోకంబునకును బ్రియం బగు నట్లు కానినా డపకీర్తి యగు. కీర్తియు నపకీర్తియు జనులకు స్వర్గనరకనిమిత్తంబులుగావున నపకీర్తి పరిహరించి పైతృకంబగు రాజ్యంబు పాండవుల కిచ్చి వారితోడ బద్ధప్రీణయుండవయి కీర్తి నిలుపుమనిన భీష్మపలుకులకు".

ఇచ్చట "పితృపైతామహంబైన రాజ్యంబునకు నీయట్ల వారు నర్హులు" అనుమాటకు నీపితృపైతామహరాజ్యమునకు నీవర్హుడవయి నట్లు వారును వారి పితృపైతామహరాజ్యమునకు అర్హులు అని యర్థము చేయరాదు. "ధృతరాష్ట్రుడే రాజ్యాభిషిక్తుడు, పాండురాజు ప్రతినిధి. పాండురాజు తనభుజబలముచే నార్జించినదానిని ధృతరాష్ట్రుడు ప్రీతిచే పాండురాజున కిచ్చెను. అది కురురాజ్యములో సగమున్నది". అను వారి వాదములోనైను అది పాండురాజునుండి పాండవులకు వచ్చినదే ! అగుటచే పిత్ర్యమగునుకాని పితృపైతామహ మెట్లగును.

పాండవులకు పిత పాండురాజు. పితామహుడు విచిత్రవీర్యుడు. ఇట్టి పితృపితామహులనుండి ప్రాప్తించినదే పితృపైతామహమగును. ప్రతివాదిమతప్రకారము పాండురాజు భుజబలముచే ప్రాప్తించుటచే స్వార్జితమైన ఆరాజ్యము పాండవులకు పితృపైతామహ మనుట అత్యంతవిరుద్ధ మగును. కనుక విచిత్రవీర్యునుండి పాండురాజునకు, పాండురాజునుండి పాండవులకు ఆరాజ్యము సంక్రమించి వారి కది పితృపైతామహమైన దనవలయును. అప్పుడు పాండురాజే రాజ్యాభిషిక్తు డనితీరవలయును. ఇప్పుడు దుర్యోధనునకు పితృపైతామహమగు టెట్లు? రెండురాజ్యములను కల్పించు టెట్లు ?

ఇక దుర్యోధనునకే అది పితృపైతామహము. ధృతరాష్ట్రుఁడు రాజ్యాభిషిక్తుఁ డగుటే దానికి హేతువు అని భావించి, "దుర్యోధనా ! నీపితృపైతామహరాజ్యమునకు నీవలె పాండవులు నర్హులు" అని యాభీష్మవాక్యమున కర్థము చెప్పుదురా ? అట్లయిన దుర్యోధనుని పితృపైతామహరాజ్యమునకు, దుర్యోధనునకు గల అర్హతతో సమానార్హత పాండవుల కెట్లుండును ? పాండవుల కర్ధరాజ్య మీయుని యెడల నరకహేతువైన అపకీర్తికి పాలైపోదు వని భీష్ముఁడు దుర్యోధనున కెట్లు చెప్పగలిగెను.

ఇక పాండవులదే రాజ్యమనువారికైనను ఈయాక్షేపము తప్పదు. పాండవుల పితృపైతామహరాజ్యమునకు "నీవలె పాండవులు నర్హులు" అని దుర్యోధనునితో సమానార్హత పాండవులకు జెప్పు టెట్లు ? అని యందురేమో వినుడు—

పాండవరాజ్యములో దుర్యోధనునకు గల అర్హత అనుభవార్హత. దుర్యోధనరాజ్యపక్షములో పాండవులకుగల అర్హతకూడ అనుభవార్హతయే. కాని దుర్యోధనరాజ్యపక్షములో "నీవలె పాండవులు నర్హులు" అని దుర్యోధనునితో భీష్ముఁ డనుట. సంగతము కానేరదు. సర్వవిధార్హతలుగల దుర్యోధనునితో అనుభవమాత్రార్హతకల పాండవులకు సమానార్హత యేది ?

పాండవరాజ్యపక్షములో సర్వవిధార్హతలు గల పాండవులకు అనుభవమాత్రార్హత కల దుర్యోధనునితో సమానార్హత 'అధికస్య ప్రవిష్టం న తద్ధానికరం' అను న్యాయమున లేకపోలేదు. దానపరిపాలనానుభవాది సర్వవిధార్హతలు కలిగియున్నవారికి దుర్యోధనునకున్న అనుభవార్హత ఉండనే యున్నది. కనుక ఆక్షేపము లేదు. పర్యవసానమేమనగా ఈ భీష్మవాక్యములు పాండవులదే రాజ్య మని స్పష్టపరచుచున్నవి.

ద్రోణాచార్యు డిట్లు చెప్పెను—

"మమా ప్యేషా మతి స్తాత యా భీష్మస్య మహాత్మనః ।
సంవిభాజ్యా స్తు కౌన్తేయా ధర్మ ఏష సనాతనః ॥
.................................................................
తత స్తే పాండవా శ్శ్రేష్ఠాః పూజ్యమానా స్సదా త్వయా ।
ప్రకృతీనా మనుమతే పదే స్థాస్యన్తి పైతృకే ॥ (ఆదిప- అ204)

దుర్యోధనా! మహానుభావుడైన భీష్ముడు చెప్పినట్లు చేయుటే నాకును సమ్మతము. పాండవుల కర్ధరాజ్యమియ్యవలసినదే! ఇదె సనాతనధర్మము. ద్రుపదపురమునుండి వారిని సబహుమానముగా రప్పింపుము. తరువాత వారు నీచేత పూజింపబడుచు ప్రజల కనుమతమై పిత్ర్యమైన వారి రాజ్యమందు స్థిరపడుదురు.

ఆంధ్రభారతము— "ద్రోణుండు దుర్యోధనున కిట్లనియె... భవత్పితామహువచనంబు సేకొనుము. మానుగ వారలతోడ నీవు విగ్రహ మొనరింప నేమిటికి గౌరవసౌబలకర్ణశిక్షలన్"

'అయ్యనఘుల పైతృకం బయిన యంశము మిన్నక వజ్రపాణికైనను గొనబోలునయ్య'

ఈద్రోణవాక్యములో పైతృకమనుమాటకు పితృపైతామహమని యర్థమే. ఇచ్చట సిద్ధాంతమిది—

అవిభాజ్యమే రాజ్యము. అది సమానముగా సర్వాధికారములతో పంచి యివ్వబడినపుడే రాజ్యవిభాగ మగును. అట్లు కాక పోష్యవర్గము జీవించుటకై నిర్దేశించి కొంత, సర్వాధికారములతో నిర్దేశించి కొంత యివ్వబడినపుడు రాజ్యవిభాగము కానేరదు.

ఈదృష్టిచేతనే భీష్ముడు పాండవులకు పిత్ర్యమైన అర్ధరాజ్యమిమ్మనుట, ద్రోణుడది సనాతనధర్మమనుట, గాంధారి నీకర్ధరాజ్యము సపరివారముగా జీవించుటకు చాలు నని దుర్యోధనునకు జెప్పుట. ధృతరాష్ట్రునిచే నట్లు నిరాక్షేపణముగా పాండవుల కర్ధరాజ్యమని యివ్వబడుట జరిగినది. ఇది రాజ్యవిభాగమని భ్రాంతిపడరాదు.

—: భీష్మాదుల మాటపై రాజ్యాధికారము నాదే అని చెప్పలేక దుర్యోధను డూరకుండుట :—

ఇట్లు ద్రోణాచార్యులు, భీష్ముడు చెప్పినట్లే చేయుమని దుర్యో

ధనునకు బోధించెను. భీష్ముడు నీవటి అర్హత వారికి లేకపోలేదు. పాండవులకు లేనట్టియు నీకున్నట్టియు, రాజ్యార్హత ఎట్టిది ? వారిపిత్రు పైతామహమైన రాజ్యములో సగము వారికిమ్ము. అని దుర్యోధనునకు చెప్పినపుడు ఆదుర్యోధనుడు—

ప్రతివాదులన్నట్లు ఆపాండవు లెట్లో పుట్టినవారు. వారు కురు వంశీయులు కారు. భారతీయులే కారు. వారికి రాజ్యము పిత్రుపైతా మహ మగు టెట్లు ? అని కాని, నాతండ్రి జ్యేష్ఠుడు, పట్టాభిషిక్తుడు అగుటవలన రాజ్యము నాకు పిత్రుపైతామహమైయుండ 'రాజ్యంబునకు నీయట్ల వారును అర్హులు' అని నీవెట్లనగలిగితివి ? అని కాని, అవి భాజ్యమై జ్యేష్ఠానుక్రమముగా వచ్చు రాజ్యమును రెండుముక్కలు చేయుట, న్యాయమేనా ? అనికాని, వారు పాండుపుత్రులు కానందున పాండురాజునకు నాతండ్రి ప్రీతితో ఇచ్చినదయినను వారికి చెందు టెట్లు? అనికాని, ఇట్టి వెఱ్ఱిమొఱ్ఱిమాటలతో భీష్మునిపై ఎదురాడనలేదు.

కారణమేమి ? ఈయుక్తులు దుర్యోధనునకు స్ఫురింపకా ? అగ్ర డీభాగములో ప్రతివాదులకంటె ఎన్నిరెట్లో ఎక్కువ నేర్చినవాడు. అట్టివాడు—

ఇవియుక్తులు కావు కుయుక్తులని, ఈయుక్తులతో తెలిసినపెద్దల సమక్షములో తనదే రాజ్యాధికారమని నిరూపింపజాల నని, తనదే రాజ్యాధికార మనుటకు తగిన సబబులు ఏమియు లేవని, పాండవులు కురువంశీయులు కారని చెప్పద మన్న తన తండ్రిని బట్టి తనకును అట్టి పరిస్థితియే ప్రాప్తించు నని ఆలోచించి అధరస్పందము చేయక మిన్నకుండెను. దుర్యోధనుడు రాజ్యాధికారికా డనునది కంఠోక్తియే. చూడుడు—

—: దుర్యోధనుడు నేను రాజ్యాధికారిని కాకపోతి నని తండ్రియొద్ద దుఃఖించుట :—

ఆంధ్రభారతము— "ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు రాజ్యభారధురంధరుంగా నెఱింగి భీష్మవిదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుం జేసిన".

"దుర్యోధనుండు యుధిష్ఠిరు యౌవరాజ్యాభిషేకంబునకు, భీమార్జునయముల పరాక్రమంబునకు సహింపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనంబుండి యిట్లనియె"

దుర్యోధనుడు దండ్రితో దన మనోదుఃఖంబు జెప్పుట.—

తే. "వీరలని పాండుసుతులకు వెఱతు నేను వెఱమటకు దగగ నిపుడు విభుడ నీవు
పాండవజ్యేష్ఠునకు బ్రీతి బరమయౌవరాజ్య మిచ్చితి గురువృద్ధరాజులొద్ద.

దానచేసి పౌరజానపదబ్రాహ్మణప్రధానవరులు ధర్మజున కనురక్తులయి... యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకంబు సేయుదమతండు పితామహుండైన...భీష్ముని, సపుత్రకుండైన ధృతరాష్ట్రుని నతిభక్తి నభీష్టభోగానుభవపరులంగా సుఖంబనుచు... ననియెప్పుడు దమలో విచారింతురు. దీనివింటె కర్ణశూలాయమానంబులైన మూఢప్రకృతుల పలుకులు విననోప".

సీ. పైతృకంబగులక్ష్మి పాండుభూపతి మున్ను తాల్చుటజేసి తత్తనయుడైన
ధర్మజుడిప్పుడు దాల్చిన నాతనితనయుండు మఱిదాని దాల్చుమీద
నిప్పాట పాండువంశేశుల వసుమతీరాజ్యవ్యాప్తులగుదురు, రాజ్యమునకు
బరువడి మేమింత బాసిన మాపుత్రపౌత్రవర్గంబును బాయునింక.

ఆ. నొరులగొలిచి కుడువనోప మే మ్మిగాకుండ మమ్ము జేయనోపుదేని
పాండురాజు తొంటిభక్తియు న ప్పాండుతనయులందు దయయు దలపకుండు.

ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయంబయినం బ్రకృతిజనులు వశ్యులు గాకున్నను గ్రమాగతంబయి మాకు నప్రియత్నలభ్యంబగు. దొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబ వలతురు. దాని నెఱింగి కాల దానసమ్మానంబులం బ్రకృతి జనంబులకు సంతోషంబు సేయుచునుండుదు. నిందుల దుష్టజనుల పక్షపాతవచనంబు లుడుగునంతకు నుపాయంబున గొంతిని పాండవులను దదీయ భృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకు బుత్తము. రాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱి వార లిందులకు వత్తురు."

ఇవి దుర్యోధనుని కంఠోక్తులు. ఇందలి అంశములను పరిశీలింపుడు. "ధృతరాష్ట్రుడు భీష్మ విదురులతో విచారించి యుధిష్ఠిరుని యౌవరాజ్యపట్టాభిషిక్తుని జేసెను".

ఇచ్చట ఆరాజ్యమున కవి, ఈరాజ్యమున కని లేక యుధిష్ఠిరుడు యౌవరాజ్యపట్టాభిషిక్తుడై చేయబడెను. అని యుండుటచేత కురురాజ్యమున కంతకును యువరాజని యే స్పష్టమగుచున్నది. ఆపై దుర్యోధనుని కూడ యువరాజును చేసినట్లు ఎచ్చటను లేకుండుటను బట్టి

